సంపుటము 2] మే 1916 [సంచిక 11

# బాలమిత్ర

## సోమరి చిన్నవాడు

ఒక సోమరి పిల్లవాడు గలడు. వానికి తెలివిలేదు. తల్లి వానిని బడికి పంపెను. బడికి పోవుటకు వాని కిష్టము లేకపోయినందున ఆడుకొనుటకు వెళ్లిపోయెను. "అరే చెట్లంత బాగా ఉన్నవి, ఎండెంత చక్కగానున్నవి. పిట్ట లెంత షోకుగా కూయుచున్నవి. నేను బడికిపోను, ఆడుకొంటాను" అని వాడనుకొనెను. అంతలో వాని కొక తేనెటీగ కనుపడెను. అది పుష్పమునుండి పుష్పమున కెగురుచుండెను. పిల్లవాడు దానితో "వచ్చి నాతో ఆడుకొను" మనెను. అయితే అది "రాను తేనె తెచ్చుకోవలెను, సోమరిగా నుండకూడ ద"నెను. అని ఎగిరిపోయెను. తరువాత వాని కొక కుక్క కనుపడెను. "కుక్కా ఆడుకొంటావా?"





"ఆడుకోను, కావలి కాయబోతున్నాను. సోమరిగా నుండరాదు" తరువాత చిన్నపక్షి కనబడెను.



"పిట్టా ఆడుకొంటావా?"

"ఆడుకోను గూడు కట్టుకొనవలెను, సోమరిగా నుండరాదు" తరువాత గాడిద వచ్చెను.



"గాడిదా, వచ్చి ఆడుకో"

"రాను బట్టలు మోయవలెను, తరువాత ఆడవచ్చును."

"ఓహో, ఎవరును ఆడుకొనుటకు రావడములేదు. అట్లయితే బడికిపోతాను. ఒంటరిగా ఎట్లా ఆడుకొనేది?" అని వాడనెను.

వెంటనే బడికిపోయి, పాఠములు నేర్చుకొనెను.

---

# మనస్సు, తెలివి

తెలివియనగా నేమి? దేవుని ఏర్పాటులను మార్గములను మన మనస్సులు చదివి కనుగొనిన దంతటికిని తెలివియని పేరు. ఆయన భూమిలో దాచిన నేలబొగ్గు, ఇనుము బంగారు, వెండి మొదలగువానిని గూర్చియు, అవెక్కడ దొరకునో దానినిగూర్చియు తెలిసికొనన నేర్చుకొనుదుముగదా.

ఆయన చెట్లేవిధము పెరుగునట్లు చేయుచున్నాడో, వాని విత్తనము లెట్టి స్థలములలో నాటినయెడల బాగుగా ఫలించునో దానినిగూర్చియు నేర్చుకొనుచున్నాము. గాలినిగూర్చి అవి తుఫానులనే వైపులకు కొట్టునట్లు చేయుచున్నవో దానినికూడ నేర్చుచున్నాము. మహాగాధమగు సముద్రపు ప్రవాహములను గూర్చియు, అవి ప్రవహించు దిక్కులను గూర్చియు నెరుగుదుము. మనుష్యు లాకాశము వైపు తమ కన్నులెత్తి నక్షత్ర మండలమందున్నలోకము లెంతెంత దూరమున నున్నవో కనుగొని, ఆ వేదిశకు ప్రయాణములు సలుపుచున్నవో ఆ మార్గములను కనుగొనుచున్నారు. భూమిని త్రవ్వి పూడ్చబడియున్న పట్టణములను కనుగొనుచున్నాము. వారే కాలమునం దెట్లు జీవించి, ఏయే కార్యముల జేసిరో తెలిసికొనుచున్నాము. మనుష్యులు జ్ఞానవంతులైన కొలది ఆవిరి, విద్యుత్ మొదలగువానిగూర్చి తెలిసికొని, వానిని తమకు సేవకులనుగా నొనర్చుకొని వానిచే పనుల జేయించుకొనుచున్నారు, వీని నన్నిటిని దేవుడు చాలాకాలమునకు ముందే జేసి వీనినుపయోగ పరచుకొనుటకై మనుష్యులకు మనస్సు నిచ్చెను. అనేక వేల సంవత్సరములు గడచి నప్పటికిని మానవమనస్సు కనుగొనవలసిన వింకా లెక్కలేకుండ గలవు. సంవత్సరములు గడచినకొలది మనుష్యుని బుద్ధి క్రమక్రమముగా

హెచ్చుచున్నది. గాన అతడు దేవునివలన తన కనుగ్రహింపబడిన ఈ చిత్రమగు మనస్సునుగూర్చి తెలిసికొనుచున్నాడు.

---

## నవ్వించినాను

సుశీల చిన్నపిల్ల. ఆమె ముద్దుముఖము చూచినవారికి ముచ్చటయేది, ఒకనాడామె పొరుగింటికిపోయి చాల సేపటివరకు రాలేదు. తల్లి పిలువగానే పరుగెత్తుకొంటూ వచ్చెను. ఆమె కండ్లు ప్రకాశించెను. పెదవులమీద చిరునవ్వుండెను.

"అమ్మా నన్ను పిలిచినావా? ఏమి కావాలె"

"ఏమి అక్కరలేదు. చాల సేపటివరకు కనపడక పోతేను పిలిచినాను ఎక్కడికి పోయినావే?"

"అన్నమ్మోళ్ల యింటికి, అక్కడే, సువర్ణము ముఖము మూడ్చుకొంటేను అది పోయేదాకా నవ్వించాను. అంతలో వాండ్ల చిట్టిపిల్ల ఏడ్చినది. దానినికూడా నవ్వించినాను. పిల్లికూన తోక ఎవరో తొక్కటప్పటికి అది మూలిగినది దానిని కూడా అలాగే చేయపోయే టప్పటికి పిలిచినావు. ఇక్కడికి వచ్చినాను" తల్లి నవ్వినది. "ఎంత మంచిపని చేసినావే!



ఆలాగే చేయుము ఇతరులను సంతోష పెట్టితే నీకును సంతోషము కలుగును."

ఇది నిజముగదా! ఇతరుల కెంత సంతోష పెట్టితే మనకు అంత సంతోషము కలుగును. కష్టములలో నున్నవారిని చిరాకు గలవారిని, జబ్బుగా నున్నవారిని సంతోష పెట్టితే నీ ముఖముకూడా చిరునవ్వుతో ప్రకాశించును.

# వేసవికాలము, శీతకాలము



బంతివలెనే భూమియు తిరుగుచున్నది. మన భూమి ఆకాశములో తిరుగుచుండగా దేవుడేర్పరచిన మార్గములోనే బోవుచు, ప్రతిసంవత్సరమును గతసంవత్సర మన మేదినమున నేస్థలమున నుంటిమో ఆదేదినమున కా స్థలమునకే వచ్చుచున్నాము. భూమి యెన్నడయినను సోమరితనముగాగాని ఆల

స్యముగా గాని తిరుగుటలేదు. క్రిస్మస్‌దినము చలికాలములో వచ్చునట్లు చేయుచున్నది. పునరుత్థానపండుగు ఎండకాలమునకు పూర్వము వచ్చునట్లు చేయుచున్నది. కొన్నిమారులు భూమి, తక్కిన సమయములకంటె సూర్యునికి మరీ సమీపముగా వచ్చుచున్నది. ఆదినములలో భూమియొక్క ఒక భాగము, బహు వేడిగా ఉంటున్నది. ఉదేకాలములందు మరికొన్ని భాగములయందు బహు చలిగానుండును. భూమిలోని తక్కిన భాగములలోను, ఇట్టిమార్పులు కలుగుచున్నందున చెట్లు గడ్డి మొదలగునవి కొన్ని సమయములందు చిగుర్చుచు, మరికొన్ని సమయములందు వాడిపోవుచున్నవి. సూర్యచంద్రనక్షత్రములు తమ తమ మార్గములలో తిరుగుచుండగా నీలాగు జరుగవలెనని మన పరమతండ్రి యేర్పరచెను. మనకు సూర్యుడు చంద్రుడును కావలెనని ఆయన యెరుగును. "ఆయన చలికి తాళగలవాడెవడు?" అని అడుగుచున్నాడు.

---

# ప్రకృతి పాఠములు

## 22-వ పాఠము

## దంతములు

కడుపులో అనేక చిన్నచిన్నగోళ్లుగలవని యిదివరకు దెలిపియుంటిని గదా. మనము తినేభోజనమునుండి ఏది




రక్తమగునో దానిని ఈ చిన్ననోళ్లు పీల్చుకొనును. గాని మనము భోజనమును తినినవెంటనే ఈ పని జరుగదు. మొదట మనము తినినది జీర్ణముకావలెను. "జీర్ణము అయినది"ని గాని "అరిగినది"ని గాని నీవు వినియుండవచ్చును. దానికి అర్థమేమి? ఇదిగో! వినుము చెప్పెదను.

నీవు అన్నమును మ్రింగగానే, దానితో కలియులాగున కడుపులో ఒకతరహా నీటివంటి రసము ఊరుచున్నది. మ్రింగిన కొంచెముసేపటికి, ఈ రసము భోజనములో నీవు తిన్న వేరువేరుపదార్థము లన్నిటిని, ఒకేవిధమైనదానిగా మార్చుచున్నది. అన్నము, మాంసము, కూరగాయలు, మిఠాయిలు, పప్పులు అన్నిటిని కలగలిపి, దానిలో అన్నమేదో,

మాంసమేదో, కూరగాయలేవో, ఏదేదో, తెలియకుండునట్లు అంతటిని ఏకము చేయుచున్నది.

తినినభోజన మీలాగయిన తరువాత, కడుపునందున్న చిన్నవోళ్లు తమపని కారంభించును. ఆ భోజనమునుండి సిద్ధమగు పాలవలె తెల్లగానుండు ఒక ద్రవపదార్థము నవి పీల్చుకొనును. ఈ పదార్థమునుండియే మనరక్తము చేయబడుచున్నది.

కడుపులోనికి బోకముందు భోజన మేమగుచున్నది? దానిని మెత్తగా విసరుటకు నీ నోటియం దొక తిరుగలి ఉన్నది. నీవు తినినదానిని పిండిగాచేయుటకు 10 జతల పండ్లున్నవి. అన్నము నెంత మెత్తగా నమలితే కడుపునందున్న ద్రవము దాని అంత సులభముగా జీర్ణింపజేయును. దుంపలు గాని మాంసపుముక్కలుగాని అంతత్వరగా జీర్ణంపజేయుదు. గనుక నోటిలో ముద్దపడగానే, దానిని మ్రింగకూడదు. బాగుగా నమలవలెను.

చెట్లకు పండ్లులేవు గాన వాటి ఆహారము ఈలాగున మెత్తబడునట్లు మనము సహాయము చేయుచున్నాము. తోటవాడు తోటను త్రవ్వుటయు, కాపువాడు పొలమును దున్నుటయును ఇందుకే. ఈలాగు చేయకపోతే చెట్ల ఆహారము బాగుగా మ్రింగజాలవు. వచ్చేపాఠములో మీకు మరికొన్ని

విషయములు చెప్పెదను. ఈలోగా, మీ పండ్లకును, ఇతర జంతువులపండ్లకు ఏమైనా భేదమున్నదేమో కనిపెట్టుడి.

---

## అడవి జంతువులు



మన తండ్రియగు దేవుడు చిన్నిచీమలు సురక్షితముగా నుండునట్లు వాటికి కావలసినవాటిని దయచేసి యున్నాడు. పెద్దపెద్ద ఏనుగులకు వాటికి కావలసినవాటిని ఇచ్చియున్నాడు. సింహములు మొదలగునవి సుఖముగా నుండునట్లు వానికి కావలసినవి వానికి దయచేసెను. ఈ పెద్దజంతువులు తమ ఆహారము వెదకునప్పుడును, శత్రువులు

వచ్చి తరుమునప్పుడును చప్పుడుచేయకుండ పోవునట్లు వాటికి మెత్తటిపాదము లిచ్చియున్నాడు. వేటకానిదగ్గరనుండి పారి పోవుటకు జింకకు ఉక్కు అంతబలమైన నరములుగలవు. చాలదూర ప్రయాణము చేయుటకును, త్వరగా పోవుటకును తగినట్లు గుఱ్ఱముకాళ్లు చేయబడినవి. ఆవు నిదానముగా నడచునట్లు దానికి తగినకాళ్లు ఇయ్యబడినవి. దేవుడు తాను చేసిన ప్రతిజంతువు ఏలాగుండునో దానిని ఎఱిగియుండి నందున వాటికి తగిన అవయవములుండునట్లు సృష్టించెను.

---

## ఆటంకముల జయించుట

ఒకనాడొక బీదకుంటి బాలుడు, కొందరు బాలురు ఆడు బంతి యాటను చాల అసూయబుద్ధితో జూచుచు నిలువ బడెను. దగ్గరనిలిచిన పడుచువాడొక డాతని ముఖముపై గనుపడుచుండిన అతృప్తిని గుర్తించి, “వారితో గలిసి యాడ వలెనని నీకు ఇష్టముగా నున్నదిగదా?” అని యడిగెను.

“అవును, నిజముగా”

“దేవుడు వారికి ధనము, విద్య, ఆరోగ్యము ననుగ్ర హించి, లోకమునకు కొంతమేలు చేయతలంచెను గదా! ఆలాగే నీకుకూడా అదేలాగున కుంటితన మిచ్చెనేమో ఎన్న డైనా తలంచితివా?” అని ఆ పడుచువా డడిగెను.

ఆ పిల్లవాడత డన్నమాటలను మరువక పలుమారు వాటినిగూర్చి తలంచి, ధైర్యముపొంది, కుంటితనము నలక్ష్యపెట్టి, తరువాత నొక మంచి క్రైస్తవవైద్యుడాయెను.

---

# బైబిలు పిల్లలు

## మోషే

(సశేషము)

ఇట్టిబాలుడు కొంతకాలమువరకు జమ్ముపెట్టెలో నైలునదీతీరము దాచబడెను. ఒకనాడు ఫరోకుమార్తె తన పరిచారకులతో స్నానముచేయ నైలునదికి వచ్చెను. పూర్వకాలములో గొప్పగొప్ప స్త్రీలకు ఇట్లే నదులకు వెళ్లి స్నానము చేయు వాడుక కలదు.

సంతోషముతో స్నానము చేయుచున్న ఈ గుంపునకు అకస్మాత్తుగా చిన్నబిడ్డ ఏడ్పు వినవచ్చెను. అగుపు సమీపముననే ఉన్నట్లుండెను. చిత్రము ఏమైయుండునా? అని అందరికి ఆశ్చర్యము ఉద్భవించెను. చూచితే నైలునదీతీరము జనులుండు ప్రదేశము కాదాయెను. ఇక పిల్లలెట్లు ఉందురు? వారి ఏడ్పు ఎట్లు వినబడును? ఈ వింతను చూచిరమ్మని దాసీని పంపగా ఆమె దగ్గరకుసమీపించుకొలది ఏడ్పుధ్వని



మరీ స్పష్టముగ వినవచ్చుచున్నందున మరీ సమీపముననే బిడ్డడున్న తావుగలదని యామెకు స్పష్టమాయెను. కన్నులెత్తి పారచూచిన నేబిడ్డయు కానరాదాయె. కాని అరుపు బాగుగా వినబడెను. మరల పరిశీలించి చూడగా జమ్ము పెట్టెయు, అందు సుందర బాలుడును ఆమె కన్నులకు కనబడెను. ఈ వార్త ఫరోకుమార్తె కెఱింగింప ఆమె ఆ సుందర బాలుని చూడగనే అతిప్రేమ పొర్లివచ్చెను ఏవిధముగానైనను ఆ బిడ్డను తానే పెంచుకొనవలెనని ఆశపుట్టెను. ఆ పిల్లవాడు హెబ్రీయబాలుడని ఆమెకు తెలిసియున్నను ఆమె

తన తండ్రికి వ్యతిరిక్తముగా ఇట్లు దాచబడెనని ఎరిగియున్నను, ఆ బిడ్డను పెంచదలచుకొనెను. చూచితిరా! దేవునికసాధ్యమైన దెద్దియైనా కలదా? ఎంతటి గొప్ప ఆజ్ఞనైనను మార్చివేసి అది మరియొకరీతి జరుగవలెనని ఆయనకోరిన ఆలాగు చేయును.

న్యాయమునకు ఈ బిడ్డడు చంపబడవలసినవాడు. అట్లు మోసముగా దాచిన తలిదండ్రులు దండింపబడవలసినవారే. అయితే ఎంత చిత్రముగా జరిగినదో చూడుడీ. ఫరోకుమార్తె చిన్నబిడ్డవైపు చూచుకొలది ప్రేమ అధికవృద్ధి చెందుచుండెను. ఆపెతోవచ్చిన దాసీలు ఆ చిన్నబిడ్డను తీసుకొని అతనికెట్లు పాలిప్పించుదమా యని విచారింపసాగిరి. అంతలో చెంతనున్న మిరియాముదగ్గరకువచ్చి "అమ్మా! అదిగో అచ్చట ఈ పిల్లవానికి పాలివ్వగల ఒకతె ఉన్నది. ఆమె ఇచ్చునేమో కనుగొని వత్తునా" అని యడుగ వారందుల కెంతయు సంతోషించి సరేయని చెప్ప నా పిల్ల అతిత్వరగా తన తల్లిని వారియొద్దకు కొంచువచ్చెను. జీతబత్తెము లేర్పరచిన పిదప యోకెబెత్తు మోషేకు పాలిచ్చుచు ఫరోకుమార్తెకె దాదిగా నా పిల్లవాని పెంచుచువచ్చెను. చిన్నవాడగు మోషే కొంచెముకొంచెము ఎదుగుచు బుద్ధి తెలుసుకొనుచుండగా యోకెబెత్తు తన జనాంగమునుగూరించి, వారి సకలావస్థల

గురించియు, ఆ పిల్లవాడును ఆ జనాంగమునకే చెందినవాడనియు, అయితే పరోక్షమార్తై తాను రహస్యముగా వాని దాచినపుడు అతని ఏడ్పువిని వాని కొంచుపోయి పెంచుకొను చున్నదనియు ఈరీతిగా అంతయు వివరముగా తెలిపెను.

## బాలమిత్ర టపా




ప్రియ బాలమిత్రులారా!

నేను ప్రతినెల చాల పత్రికలను కొని చదువుటవలన యిట్లు వ్రాయుటకు నాకు ఉల్లాసము కలిగెను. నేను 3 వ ఫారము బెజవాడ బోర్డింగు

లోనుండి సి, యమ్, యస్, హైస్కూలులో చదువుచుంటిని, మేమందరము 34 గురము. వీరిలో 8 మంది హైస్కూలులో చదువుచుండిరి. మేము యిక్కడ నొక క్రొత్త మీటింగును ౪ నెలలనుండి జరుపుచుంటిమి దాని పేరు చిన్నపిల్లల సమాజము దీనియందు అనేకులు సెక్రెటరీలుగా నేర్పరచబడిరి. వారిలో నేను లుక్ ఔట్ సెక్రెటరీగా నేర్పరచబడితిని. మేము ఉదయమున ౬ గంటలకు లేచి వేదవాక్య సమాజపు కార్డు ప్రకారము చదువుకొని కొన్ని బంగారు వాక్యములును కంఠత చేయుచుంటిమి, మరియు మా మీటింగును ప్రతి శుక్రవారము సాయంత్రము 7 గంటలకు జరుగును దానిని కొందరు దొరలుకూడా చూచిరి. అందు విషయమై అందరున్ను మమ్మును ప్రోత్సాహ పరచిరి, మరియు నా తండ్రికి, మేము ౫ గురుపుత్రులము. వారిలో నేను ద్వితీయుడను. మా తండ్రి ఉత్తర ప్రదేశములయందు పని చేయుచున్నాడు. మరియు ఫెబ్రువరి ౯ వ తారీఖున మేము యిక్కడ హాఫ్ ఇయర్లీ మీటింగు జరిపితిమి. దానియందు నేను రిపోర్టు చదివితిని, మరియు దానిలో అనేకములైన ఫార్సులను కూడా వేసితిమి మావలన యిక్కడనున్న ఆడపిల్లలు కూడా నొక మీటింగును స్థాపించిరి. అట్లునున్నా మీరుకూడా దయతో చేయుదురని ప్రార్థించుచున్నాను. మీకు నా సలాములు.

ఇట్లు ప్రియ బాలమిత్రుడు,

వెలమూర్తి జాన్ సుందరము,

బెజవాడ

C. L. S. PRESS, MADRAS—1916